# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట్రామానాయుడుగారు

సంపాదకులు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. No. 18
స్థాపితం 1930
సంపుటి: 57 సంచిక: 27
4-7-1986
శుక్రవారం
12 పేజీలు: రూపాయి


# మంత్రులకు దినదినం గండమే!

మా హైదరాబాదు విలేఖరి

రాజధాని రాజకీయ వాతావరణం వేడిగా, విచిత్రంగా వుంది. ఇది తుఫాను ముందరి ప్రశాంతతో, లేక పదుగురు పెట్టి ప్రయోజనం లేదన్న రాజకీయ వాదుల నిర్లిప్తతో అర్థంకావడంలేదు. తెలుగుదేశం మంత్రుల ముఖారవిందాలు మాత్రం కినుకతో కోపంతో కంది, కంద గడ్డలై తయారైవున్నాయి. ఒక్కరిలోనూ కళాకాంతులులేవు.

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు తమను, తమ పదవులను ఏమి చేయనున్నారోననే భయమే వీరినిట్లా క్రుంగదీస్తున్నది. ఎన్. టి. రామారావు మంత్రులతో ఫుట్‌బాల్ ఆట ఆడిస్తున్నారు. వారిని శాంతియుతంగా బ్రతకనివ్వడంలేదు. పి. ఎ. లను పి. ఎస్. లను నేరుగా నియమించడంతో ప్రారంభమైంది ఆయనక్రీడ. అప్పటినుంచి రోజుకొక నిర్ణయం. కొందరు మంత్రుల ఫైళ్ళను ఆయన తనదగ్గరకు తెప్పించుకొని, స్వయంగా పరిశీలిస్తున్నారు. కొన్ని నిర్ణయాలను తారుమారు చేస్తున్నారు. కొందరు మంత్రులపై నిఘా విభాగాలు ఒక కన్నేసివుంచాయట; ఎ సి బి దర్యాప్తులు ఇంకొకవైపు కొనసాగుతున్నాయి. మంత్రులకు మాట మాత్రంకూడా చెప్పకుండా, సెక్రటేరియట్‌లోని వారిగదులను మార్పు చే[illegible] కాక. ప్రత్తి మణెమ్మ వంటి జూనియర్ మంత్రి దగ్గర రాఘవరావుకు తగిన ఆఫీసు కేటాయించి, సాక్షాత్తు హోం మంత్రిని ఇరుకుగదిలోకి విసిరేశారు. ఈ మార్పులు, పరిపాలనా సంబంధమైన, లేదా రాజకీయమైన అవసరాలేవీలేవు; ఎన్టీఆర్ అనుకున్నారు-జరిగిపోయింది-అంతే!

ఈ అవమానాలతోనే మంత్రులు, తమ కార్యదర్శుల దగ్గరగాని, అనుచరుల దగ్గరగాని తలెత్తుకోలేక సతమతమవుతుంటే ఇంకొకప్రక్కనుంచి మంత్రులను తీసేస్తున్నారహో అంటూ రోజుకొక పుకారు జపానుకార్తెకంటె జోరుగా రాజధానిని చుట్టేస్తున్నాయి. కర్ణాటక మంత్రులకు పట్టినగతి చూశాక వీరికి కంటినిండా కునుకుపడితేఒట్టు. అసమర్థులను, అవినీతిపరులను అన్నగారి విశ్వాసం కోల్పోయినవారిని, అల్లుడుగారి అభిమానానికి దూరమైనవారిని తప్పిస్తారని ఈ పుకార్లు ప్రచారం చేస్తున్నాయి. ఈ నాలుగు కొలమానాలు పెడితే, బహుశా మంత్రివర్గంలో ఎన్. టి ఆర్ తప్ప, ఇంకెవ్వరూ మిగలకపోవచ్చు. అందువల్ల ఎవరికివారు గుమ్మడికాయలదొంగల వలె భుజాలు తడుముకుని, భయంతో హడలిచస్తున్నారు. నింపాదిగా, నిబ్బరంగా వుండేది, ఒక్క నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి! మిన్నువిరిగి మీదపడినా తనకు ముప్పురాదన్న భరోసా ఆయనకు వుంది.

రకరకాల అవమానాలతో, ఆగ్రహాలతో అందరూ ఉక్రోషంతో ఉడికిపోతున్నా, ఒక్కరిలోనూ తమ భావాలు బయటపెట్టే సాహసంలేదు. కె. ఇ. కృష్ణమూర్తి. రామచంద్రారెడ్డి, జానారెడ్డి తదితరులుకూడా అంతఃపురాలలో చేరి, పళ్ళు పటపట కొరుకుతున్నారట గాని, గడప దాటితే నోరు కట్టేసుకుంటున్నారు. వారు మాత్రం ఏంచేస్తారు- ప్రమాదం ముంచుకొస్తే మాట సాయంచేసేందుకు ఒక్క ఎమ్మెల్యే అయినా వెనుక నిలబడతాడన్న నమ్మకంలేదు. ఎమ్మెల్యేలందరూ సిగ్గా మంత్రుల కళ్ళనీళ్ళు తుడిచి, ఓదార్పు తమేతప్పు, బహిరంగంగా మాట తొణకడంలేదు.

అంతేకా, ఈ భయమంతా వీరు కల్పించుకున్నదేనా, లేక ఎన్ టి ఆర్ కు నిజంగానే కొందరు మంత్రులను తొలగించాలన్న ఆలోచన వుందాఅన్న ప్రశ్నకు సమాధానం దొరకడంలేదు. ఆయనకా ఆలోచనవుండివుంటే, దాన్ని ఆచరణలో ఎప్పుడు పెడతారు అన్నదికూడా [illegible] విషయమే.

రేపు 14 తేదీనుంచి అసెంబ్లీ సమావేశాలు ప్రారంభమౌతున్నాయి. ఆ తేది ఉదయం ముఖ్యమంత్రి, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిని మాత్రం ఇంటికిపిల్చి రహస్యమంతనాలాడారు. వారి మధ్య అసెంబ్లీ వ్యవహారాలతప్ప మరేదీ ప్రస్తావనకు రాలేదని చెప్తున్నారుకాని, మంత్రులకుమాత్రం తమవిషయమే చర్చకు వచ్చిందని అనుమానం. అసెంబ్లీ సమావేశాలలోగా తమను పెరికేస్తారా లేక అవి ముగిసేదాకా ఆయువు పోస్తారా అని

—కొరవ 7 వ పేజీలో

దాదాపు పదిహేనేళ్లపాటు

# పంచాయతీరాజ్యాలు కాదు అవి ఆనంవారి రాజ్యాలే!

పంచాయతీ సమితులను తెలుగుదేశం ప్రభుత్వం సమాధిచేసింది; ఆ సమాధులకు స్పెషలాఫీసర్లు కాపలాపెట్టింది. 1959 నుంచి మొదట బ్లాకులుగా తర్వాత సమితులుగా మార్పుచెందిన ఈ సంస్థలను గురించి పరిశీలించేముందు బ్లాకు ప్రతినిధులుగానో, సమితి అధ్యక్షులుగానో వుండి దివంగతులైనవారిని ముందుగా ఒకసారి సంస్మరించుకోవటం బాగుంటుంది.

1970 ఫిబ్రవరిలో ప్రకాశంజిల్లా ప్రత్యేకంగా ఏర్పడి, అందులో కందుకూరు డివిజను చేరేవరకు నెల్లూరుజిల్లాలో మొదట 14 జాతీయ విస్తరణకేంద్రాలు; 14 సమితులు-మొత్తం 28 వుండేవి. అందులో తొమ్మిది కందుకూరుడివిజన్ లోనివి. వీటిలో రామిరెడ్డి దశరథరామిరెడ్డి (వెంకటాచలం), మెట్టా రాజగోపాలరెడ్డి (తోటపల్లిగూడూరు), దువ్వూరు బలరామిరెడ్డి (ఇందుకూరుపేట), గుండపనేని పట్టాభిరామస్వామిచౌదరి (కొండపి) ఎల్లసిరి రామకృష్ణారెడ్డి (సూళ్ళూరుపేట), నెల్లూరు వెంకటరెడ్డి (రాపూరు), వేమిరెడ్డి అయ్యపరెడ్డి (కావలి), లింగారెడ్డి రామకృష్ణారెడ్డి (ఉలవపాడు), దేసిరెడ్డి వెంకటరెడ్డి (అల్లూరు) ఎన్. రామిరెడ్డి (పొదిలి), దొడ్ల లక్ష్మీనరసారెడ్డి (బుచ్చిరెడ్డిపాళెం), బద్దెపూడి పేరారెడ్డి (సూళ్లూరుపేట), వేనాటి సుబ్బారెడ్డి (సూళ్లూరుపేట), సుంకర వెంకటనరసయ్య (వింజమూరు) దివంగతులైనారు ఇందులో దురదృష్టకరమైన విశేషం సూళ్లూరుపేట సమితికి మొదటనుండి ఎన్నికైన ముగ్గురు అధ్యక్షులూ కీర్తిశేషులు కావటం! మరే సమితిలోనూ ఆవిధంగా జరగలేదు

1959 లో సమితులివి- తాళ్ళూరు, కొండపి, ఉదయగిరి, వెంకటాచలం, ఇందుకూరుపేట, గూడూరు,పొదలకూరు, దర్శి, వెలిగండ్ల, చేజర్ల, తోటపల్లిగూడూరు, నాయుడుపేట, వెంకటగిరి. ఇందులో 1964 ఎన్నికలొచ్చేసరికి తోటపల్లిగూడూరు, చేజర్ల, నాయుడుపేట సమితులు రద్దయ్యాయి; 1981 కి నాయుడుపేటమాత్రం తిరుగా పునరుద్ధరింపబడి.

సూళ్ళూరుపేట, బాలిరెడ్డిపాళెం, రాపూరు, కోవూరు, బుచ్చి, అల్లూరు, కావలి, చినక్రాక, వరికుంటపాడు, కనిగిరి, తర్లుపాడు, పొదిలి, కందుకూరు

## "కబోదులు కాని కబోదులు!"

1964 ఆగస్టులో జరిగిన కోవూరు సమితి ఎన్నికలో మొత్తం సభ్యులు 36 మందిలో 11 మంది వాగ్రూపంగా తమ ఓటు ఎవరికైంది చెప్పారు. వీరంతా కోదూరు శ్రీనివాసులురెడ్డి అభిమానులు వీరు కబోదులూ కాదు, నిరక్షరాస్యులూ కాదు; అయినా తమ విధాయితను బహిరంగంగా చాటుకోడానికి వీరు రహస్య ఓటింగు సూత్రాన్ని ప్రక్కన పెట్టినట్లుంది

ఆ పదకొండు మంది పెద్దలు వీరు- ఆర్. వి. జి. కృష్ణారెడ్డి, తుంగా రాజగోపాలరెడ్డి, దాముచర్ల వేణుగోపాలరెడ్డి, వి. సుబ్రహ్మణ్యం, వి రాజగోపాల నాయుడు, గురిజాల వెంకటరమణయ్య, గద్దె మస్తానయ్య, దేవిరెడ్డి కోదండరామరెడ్డి. తుమ్మల కోటమ్మ, టి చెంచురెడ్డి, బిరదవోలు రమణారెడ్డి.

గుడ్లూరు-ఇవి 14 బ్లాకులు. వీటికిదా సమితులవలెనే ఒక్కో బ్లాకుకు పంచాయతీ అధ్యక్షులలో ఒకరు ప్రతినిధిగా ఎన్నుకోబడేవారు. నల్లపరెడ్డి చంద్రశేఖ

## నాలుగుసార్లు అధ్యక్షుడు!

కోట సమితికి శ్రీ నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి నాలుగుసార్లు అధ్యక్షుడయ్యాడు! 1959, 1961, 1970, 1972 లలో ఆయన ఆ సమితికిఅధ్యక్షుడు; ఆ సమితి అధ్యక్షుడుగావుండే జి.ప. ఛైర్మన్ అయ్యాడు.

నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిరెండుసార్లు కోట సమితిని పాలించాడు- 1962, 1964; మొత్తానికి కోట సమితి కోట ఇప్పటివరకు నల్లపరెడ్డివారి చేయిదాటిపోలేదు!

రెడ్డి మొట్టమొదట ఎన్నికైంది బాలిరెడ్డిపాళెంనుంచే; తర్వాత దానిని కోటకు తీసుకపోయారు. మేగోటి బుచ్చినుండి మూడుఓట్ల మెజారిటీతో గెల్చింది, కోవూరునుండి పెళ్ళకూరు నాలుగు ఓట్లతో ఓడిపోయింది అప్పుడే! 1964 వచ్చేసరికి బాలిరెడ్డిపాళెం, అల్లూరు, చినక్రాక, వరికుంటపాడు, కందుకూరు పోయి, కోట, వింజమూరు, ఉలవపాడు కొత్తగా వచ్చాయి.

28 బ్లాకులు- సమితులకు ఎన్నికైనవారువీరు- వెంకటాచలం- రామిరెడ్డి దశరథరామరెడ్డి, తోటపల్లి గూడూరు- మెట్టా రాజగోపాలరెడ్డి, పొదలకూరు- కాకాణి రమణారెడ్డి, చేజర్ల-ఎడమాకు కృష్ణారెడ్డి, ఇందుకూరుపేట-దువ్వూరు బలరామిరెడ్డి ఉదయగిరి- కంభంగుంట సుబ్బారెడ్డి, కొండపి- గుండపనేని పట్టాభిరామస్వామి చౌదరి, గూడూరు- వేమారెడ్డి రామచంద్రారెడ్డి, వెంకటగిరి- పాటిబండ్ల వెంకటస్వామిరెడ్డి, వెలిగండ్ల- పులి వెంకటరెడ్డి, నాయుడుపేట- పల్లెటి సుబ్రహ్మణ్యంనాయుడు, సూళ్లూరుపేట-ఎల్లసిరి రామకృష్ణారెడ్డి, బాలిరెడ్డిపాళెం- నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, రాపూరు- నెల్లూరు వెంకటరెడ్డి, కోవూరు- కోదూరు శ్రీనివాసులురెడ్డి, బుచ్చి- మేవకూరు గోపాలకృష్ణారెడ్డి, అల్లూరు- దేవిరెడ్డి వెంకటరెడ్డి, కావలి- వేమిరెడ్డి అయ్యపురెడ్డి, చినక్రాక - గొట్టిపాటి కొండపనాయుడు, వరికుంటపాడు - ధనెంకుల నరసింహం, కనిగిరి - గోళ్ళ తిరుపతినాయుడు, తర్లుపాడు-ఉల్లారెడ్డి, పొదిలి- కాటూరి నారాయణస్వామి, కందుకూరు- బత్తిన వీరనరసింహచౌదరి.

1959 లో వుండిన 28 బ్లాకులు కాస్తా 21 అయ్యాయి. అనలుసాయకమిటీ 17 మాత్రమే సూచించింది; ప్రభుత్వం ఆ సంఖ్యను 21 చేసింది. రెండవసారి 1964 జూన్ 19 తేదీ ప్రారంభమైన ఎన్నికల ఆగస్టు 22తేదీకి గాని పూర్తి లేదు.

గూడూరు, కోట, సూళ్ళూరుపేట, కోవూరు, బుచ్చి, ఆత్మకూరు, కావలి నిర్ణీత తేదీన జరగలేదు; హైకోర్టు స్టేతో ఆగిపోయాయి. గూడూరుసమితిలోని తన గ్రామాన్ని తీసుకపోయి కోట సమితిలో కలిపినందుకు శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి కోర్టుకెక్కి ఎన్నిక నిలిపించాడు. కాని తర్వాత జరిగాయి అప్పుడు సమితి అధ్యక్షులుగా ఎన్నికైనవారు - ఆత్మకూరు- పంట్లూరు వెంకట సుబ్బారెడ్డి, కోట- నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి. ఇందుకూరుపేట- ఆనం భక్తవత్సలరెడ్డి, రాపూరు- ఎం. ఆదినారాయణరెడ్డి, వెంకటాచలం రామిరెడ్డి దశరథరామరెడ్డి వెలిగండ్ల- వెండిదండి పిచ్చిరెడ్డి. వీళ్లందరూ ఏకగ్రీవంగా ఎన్నికైనారు. ఇక పోటీలో విజేతలు: కావలి - వేమిరెడ్డి అయ్యపురెడ్డి, వెంకటగిరి - గోపాలకృష్ణ యాచేంద్ర, కోవూరు-కోదూరు శ్రీనివాసులురెడ్డి: బుచ్చి - దొడ్ల లక్ష్మీనరసారెడ్డి, గూడూరు ఈపూరు కుమారస్వామి

—తరువ 10 వ పేజీలో



## పినాకినీ తీరం

రాజాగారి మార్పు ఇది ఎన్నోసారో?

వెంకటగిరిరాజా శ్రీ గోపాలకృష్ణ యాచేంద్ర ఇందిరా కాంగ్రెస్‌లో చేరారట; ప్రధాని రాజీవ్‌గాంధిని బలపరచవలసిన అవసరంవుంది కాబట్టి తాను ఇం. కాం. లో చేరినట్లు ఆయన చెప్పారున్నారు,

జాముచేసి విధవసనిని సమర్థించుకో దానికి ప్రతిఒక్కరూ అదర్శమైన గొప్ప కారణం చెప్పకొంటుంటారు. తెకుంటే ప్రజలు ఛీకొడతారని భయం. శ్రీ గోపాలకృష్ణ యాచేంద్రులవారి విషయంకూడా అంతేనని నా అభిప్రాయం. అన్ని కష్టాల్లో, అన్ని సమస్యల్లో నలిగిపోతుండిన ఇందిరాగాంధీకి బలం అందించాలనే ఆలోచన ఆయనకు కలగలేదు; ఇప్పుడు రాజీవ్‌గాంధీకి అందివ్వాల్సిన అవసరం కలిగిందట! ఈ స్వార్థపూరితమైన, సంకుచితమైన, అవకాశవాద ప్రేరితమైన కారణాలు నమ్మి తనతర్యను నమర్థించేవాడు లేరని, తాను చెప్పిన కారణాన్ని నమ్మే అవివేకులులేరని యాచేంద్రులవారు గ్రహించగలిగితేబాగుంటుంది.

అసలు వెంకటగిరి సంస్థానంవారి రాజకీయాలే క్షణం చిత్తం క్షణం మాయగా వుంటుంటాయి. తమకు ఎప్పటికి ఏది అవసరంగా వుంటుందో, ఎవరు అవసరమువుతారో ఒటుపోవడం, వారివెంట పడటమే ఇంతకాలంగా సాగుతున్నవారి రాజకీయం. వారు కొజువని రాష్ట్ర జిల్లా నాయకులెవరైనా వున్నారా? కొంతకాలం ఆనంవారికి భృత్యాను భృత్యులు; మరి కొంతకాలం నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డికి ఆప్తులు; ఆ తర్వాత నేదురుమల్లి జనార్దనరెడ్డికి భక్తులు. వెంకటగిరి రాజకీయాలలోకూడా వీరి పాత్ర అస్పష్టంగానే వుంటుంది. ఒకప్పుడు వెంకటస్వామిరెడ్డి సన్నిహితుడు; ఇంకోసారి రాఘవరెడ్డి స్నేహితుడు; మరోసారి తమకు తామే ముఖ్యులు. ఒక పద్ధతి, ఒకదారి, ఒక నియమం, ఒకనీతి ఈమూడు దశాబ్దాల నుంచి వారిలో నేను చూడలేదు వారు కోటీశ్వరులు; ప్రభుత్వంతో వారికి అవసరముంటుంది. అటువంటప్పుడు పార్టీ రహితంగావుంటూ, అధికారానికి వచ్చిన ప్రతి ఒక్కరికి సలాం కొడుతూ కాలం గడుపుకుంటే సరిపోదా? ఈ వేషాలన్నీ ఎందుకు?

ఇక గోపాలకృష్ణ యాచేంద్రగారి సంగతి, ఆయన నేను ఏపార్టీలో వున్నా ఒకటే. ఎవర్ని బలపరచినా ఒకటే; ఫలితం శూన్యంగా వుంటుంది. తన విలువతెలీని తనంతో. ఏరోటికాడ ఆ పాటలతో ఆయన పరపతి పోగొట్టుకొని చాలకాలమైంది. ఆయన అన్నగారి విలువతో ఆయన చెలామణి కావలసిందేగాని, స్వంత పలుకుబడి శూన్యమై చాలకాలమైంటనుకుంటాను. ఆయన కాంగ్రెస్ మీద భక్తితో, రాజీవ్‌మీద దయతో కాంగ్రెస్ లో చేరివుండడు; ఆ దేదో కుటుంబ వ్యవహారాలలో వచ్చిన విభే

—తరువ 10 వ పేజీలో

# జమీన్ రైతు

## ప్రైవేటుబడులకుదండన

విద్యావ్యవస్థను పట్టిపీడిస్తున్న చెదపురుగులను తొలగించ డానికి విద్యామంత్రి శ్రీ ముద్దుకృష్ణమనాయుడు గట్టిప్రయత్నమే చేస్తున్నారు. మెచ్చుకోదగిన విషయమిది. ఈ రెండేళ్ళలో ఆయన కాలేజీలు, స్కూళ్ళను సకాలంలో తెరిపిస్తున్నారు; ఫలితాలు సత్వరంగా ప్రకటింపచేస్తున్నారు; పుస్తకాలు కోరినప్పుడు సరఫరా చేస్తున్నారు; ప్రైవేటు ట్యూషన్లతో కాలేజీలను భ్రష్టుపట్టించిన లెక్చరర్లకు గట్టిగుణపాఠం నేర్పారు; సమ్మె బెదిరింపులను నిర్వీర్యం చేశారు; ఇవన్నీ చేయడం, చేయగల్గడం సామాన్యమైన పనేమీకాదు. ఎన్నో ప్రలోభాలకు, పలుకుబడులకు తట్టుకొని, దృఢంగా వ్యవహరించి, విద్యావ్యవస్థను కొంతకుకొంత దారికితెచ్చారు.

ఇప్పుడాయనదృష్టి ప్రై వే టు స్కూ ళ్ళ పై ప్రసరించింది. విద్యను లాభసాటి వ్యాపారంగామార్చి మధ్యతరగతి కుటుంబీకులను దోచుకుంటున్న ఇంగ్లీషు మీడియం బడులపై విద్యామంత్రి బడితెను ఝుళిపిస్తున్నారు. నిజానికి దండనకు వారు అన్నివిధాల అర్హులుకూడా!

ఇంగ్లీషు చదువు చదవనిదే సమాజంలో గు ర్తింపు, గౌరవం లభించని దౌర్భాగ్యపరిస్థితి మనది. ప్రభుత్వం ఉచితంగా నడిపే మునిసిపల్ బడులలో ఇంగ్లీషు చదువుసంగతి దేవుడెరుగు. పిల్లలు కనీస సంస్కారం నేర్చుకునే ఆ రో గ్య వాతావరణంకూడాలేదు. ఈ బందిలదొడ్లకుపంపి, తమ బిడ్డలను పాడుచేయటానికి, ఏమాత్రం స్తోమతవున్న తల్లిదండ్రులుకూడా ఇష్టపడడంలేదు. ఈ బలహీనతను అవకాశంగాతీసుకుని ప్రైవేటుస్కూళ్ళయాజమాన్యాలుతల్లిదండ్రులను దోపిడీచేసిపారేస్తున్నాయి. రకరకాలపేర్లతో డొనేషన్లుదండి, వందల్లో ఫీజులుగుంజి, పీల్చిపిప్పిచేస్తున్నాయి. అట్లని వీరు జపురుకొంటున్న మొత్తాలకు తగినస్థాయిలో విద్యను నేర్పుతున్నారా అంటే అదీలేదు. ఏవో కొద్దిస్కూళ్ళకుతప్ప, ఇటువంటిచాటిలో అధికశాతానికి స్వంత భవనంకూడా వుండదు. ఇరుకు బాడుగిళ్ళలో ఏవసతులూ కల్పించకుండా, అర్హతకల్గిన ఉపాధ్యాయులనుకూడా నియమించకుండా ముమ్మి దాడి చిలకపలుకులుమాత్రం పిల్లలకు నేర్పి తల్లిదండ్రులను మోసంచేస్తున్నారు; మాయచేసి పబ్బం గడుపుకుంటున్నారు,

వీధికొక్కటిగా, తామరతంపరగా వెలుస్తున్న ఇటువంటి ప్రైవేటు బడులను నియంత్రించడం, విద్యావ్యవస్థ సంక్షేమానికి అత్యంతావశ్యకం. డొనేషన్లను కఠినంగా నిషేధించడం; అధిక ఫీజులను తగ్గించడంవంటి చర్యను చేపడుతున్నప్పుడు విద్యామంత్రి ఎయిడెడ్ స్కూళ్ళను ఒకపట్టు పట్టబోతున్నారు.

అసలు ఇటువంటిస్కూళ్లు తామరతంపరగా, వీధికొక్కటిగా వెలవడకుండా నియంత్రించడం అవసరం. కొత్తబడి తెరిచేటప్పుడు విధిగా ప్రభుత్వ అనుమతి పొందడం, ఆటస్థలం, భవనం, విద్యాపరికరాలు, అర్హతకల్గిన అయ్యవార్లు వంటి కనీస వసతులు కల్పించడం నిర్బంధంగా చేయాలని శాసిస్తే, ఈ విద్యావ్యాపారుల సంఖ్య కొంతకు కొంతైనా తగ్గుతుంది.

అట్లని, అసలు ఈ బడులను, హింసించి, మూతవేయించినా తల్లిదండ్రులు అల్లాడిపోతారు. ప్రభుత్వ స్కూళ్ళలో విద్యాప్రమాణాల స్థాయి మెరుగుపడినంతవరకు ఇవి అవసరమే. ఈ కఠిన వాస్తవాన్నికూడా దృష్టిలో వుంచుకొని, తల్లిదండ్రులకు అపకారం కల్గనిరీతిలో ఉభయతారకంగా సముచిత నిర్ణయాలు తీసుకుంటే ముద్దుకృష్ణమనాయుడు అందరిమెప్పు పొందతాడు



## జమీన్ రైతు

3.7.1936

నెల్లూరు ముచ్చట్లు

యువక ఛైర్మన్ (మునిసిపల్ ఛైర్మన్) ఆర్. ఎల్. రెడ్డిగారి అధ్యక్షత క్రింద గతనెల 27 తేదిన జరి జరిగిన ప్రథమ మునిసిపల్ మీటింగు పేరిగాడి కోర్టును జ్ఞాపకపరిచింది.

• • •

(నెల్లూరు మునిసిపల్ వైస్‌ఛైర్మన్ ఎన్నికకు సంబంధించిన వార్తాఖండికలు దిగువ ఇస్తున్నాము. ఆ ప్పటి ఎన్నికలో ముంగమూరు విశ్వనాథరావు ఎన్నికైనారు; వెంకటరత్నం నాయుడు ఓడిపోయారు)

ఎదుటి పడీయులు 14 మంది రామిరెడ్డి (తి క్క వ ర పు), బడి సుబ్బమ్మ, కొల్లి వెంకటసుబ్బారెడ్డి, అంచనాల శేషయ్య, ఆది ఆంధ్ర, ఇబ్రహీంసాహెబ్, ము బ్బా రా వు, విశ్వనాథరావు, ఎ.సి. రెడ్డి గుండాల వెంకటసుబ్బారెడ్డి, వెంకయ్యశెట్టి మాడభూషి నరసింహాచారి, కొండూరు నరసింహాచారి, జేమ్సుగారలు ఒక కట్టగా రావతం వెంకటరత్నంనాయుడుగారికి భయంగొల్పింది, ముఖాభిమానాన్ని ఎదురీతజాలక ఓటిస్తానన్న రంగయ్యనాయుడుగారు 14 మంది

### 50 ఏళ్ల క్రితం ఈవారం

కట్టనుచూచి ఓడిపోయేవానికి ఓటివ్వి మాటలుపడేదానికన్నా, గెలిచేవారికివ్వడం లాభకరమని ఛైర్మన్ ఎన్నికలోమాదిరి ద్రోహంచేయ సాహసించక నాయుడుగారికి తనఓటు రాదని ఎన్నికకుముందే తెలిపారు.

• • •

ముంగమూరు విశ్వనాథరావుకు 14 ఓట్లు. నాయుడుగారికి 11 ఓట్లు వచ్చాయి. నాయుడుగారికి పరాభవం అయింది. తె ర్దు నా కి ప్రకంపెరుచుకున్నట్లయింది. మునిసిపల్ రంగంలో పీరియాడ్ పూర్తిఅయిందని చెప్పవచ్చు.

దారుణాలా? చిత్రాలా?

ఆంధ్రదేశంలో ఒక జమీందారిలో పేదవాడొకడు తా టి చెట్టు ఆ కొట్టుకున్నందుకు అతన్ని పదిమందిలోకి పట్టి మీసంలోకివెంట్రుకలను ఒక్కొక్కటి లాక్కున అన్నివెంట్రుకలుపీకించారట. ఇలాంటిఉగ్రులను ఎలా మరమ్మత్తు చేయాలో ఆ బ్రహ్మదేవుడికే ఎరుక.

• • •

కృష్ణ జిల్లాలో ఒక జమీందారిలో పారులు ఒకనాడు వనభోజనానికివెళ్ళి ప్రక్క జమీందారుగారి జటుక బట్టల లోని రాళ్ళను వంటచేసుకొనేందుకు పొయ్యిలకు వాడుకున్నారట, జమీందారు గారికి తెలిసి వాడుకున్న ఒకో రాయి 1 కి రు 1 వంతున అపరాధం విధించి వసూలుచేశారట. వసూలైన మొత్తం ఆ జటుకబట్టలన్నిటికీ ఖర్చు పెట్టిన మొత్తాన్ని మించిందట. దీన్ని బలవంతపుజరిమానా దౌర్జన్యమంటారా? మరేమైనా కొత్తపేరు పెట్టుతారా?

## ప్రజాస్వామ్యమంటే ఎన్నికల రద్దా?

ప్రజాస్వామ్యాన్ని గురించి గొంతు చించుకుని కేకలుపెట్టే ముఖ్యమంత్రి, పురపాలక సంఘాలకు ఎన్నికలు జరిపే ధైర్యంలేక స్పెషల్ ఆఫీసర్లను నియమించడాన్ని ఎట్లా సమర్థించుకుంటారు. అధికారంలో వుండేవారు, తాముచెప్పేది ఆచరణలో పెట్టాలి, కాంగ్రెసు పార్టీ అప్రజాస్వామిక విధానాలను అనుసరిస్తుందని, చైతన్యరథమెక్కి వీధివీధినా రచ్చచేసిన ఎన్. టి. ఆర్. ఇంత నిస్సిగ్గుగా ప్రజాస్వామ్యాన్ని కాలరాచడం దుర్మార్గం తన ఏకపక్ష నిర్ణయాలే ప్రజాస్వామ్యమనే అహంకారంతో ఆయన వ్యవహరిస్తే, ప్రజలే ఎప్పుడో ఒకసారి బుద్ధి చెప్తారు, ముఖ్యమంత్రికి, నిజంగా ప్రజాస్వామ్యంపైగౌరవంవుంటే తక్షణం పంచాయితీలు, మునిసిపాలిటీలవంటి అన్ని ప్రజాసంస్థలకు ఎన్నికలు జరపాలి. అది చేతకానప్పుడు, ఎన్నికలతో ప్రజలను ఎదుర్కొనే ధైర్యం లేనప్పుడు ప్రజాస్వామ్యం గురించి మాట్లాడే నైతిక హక్కు ఆయన కోల్పోతారు.

నెలూరు —ఎస్. రామారావు

### గ్రంథాలయ దుస్థితి

చిన్నచెరుకూరులో 1944 లో రామకృష్ణ గ్రంథాలయం స్థాపించారు. పక్కా బిల్డింగులో, సుమారు 2 వేలుదాక పుస్తకాలు వున్నాయి. కాని, సరైన పర్యవేక్షణ లేక చాల పుస్తకాలు చిరిగిపోతున్నాయి. ఒక పాత టేబిలు, రెండు విరిగిపోయిన కుర్చీలు తప్ప మరేమీలేవు రీడింగ్‌రూములో. ఒక దినపత్రిక, రెండు వారపత్రికలు మాత్రమే తెప్పిస్తున్నారు. అవికూడా రీడింగ్‌రూమ్‌లో ఎప్పుడూ ఉండవు. పేపరు అడిగితే ఎవరో తీసుకుపోయారు అని చెప్తుంటారు.

గ్రామంలో సుమారు 1500 వరకు జనాభావుంది. హైస్కూల్, హాస్టల్స్ వున్నవి. విద్యార్థులు, విద్యావంతులు, ఉద్యోగులు వున్నారు. గ్రంథాలయం మాత్రం దుస్థితిలో వున్నది. పార్ట్‌టైం ఉద్యోగిని నియమించారు. కొత్త పుస్తకాలు చాలినంతగా తెప్పించడంలేదు. గ్రామాధికారులు ఈ గ్రంథాలయాన్ని గురించి పట్టించుకున్నట్లులేదు.

జిల్లా గ్రంథాలయ సంస్థ వారు ఈ గ్రంథాలయాన్ని తమ అధీనంలోకి తీసు




కొని అర్హత గల్గిన ఉద్యోగులను నియమిస్తే గ్రామస్థులకుమేలుచేసినట్లవుతుంది.

—ఎల్. వెంకటేశ్వరరావు

చిన్నచెరుకూరు

### డి. కె. కాలేజిలో పి. జి. కోర్సులు

నెల్లూరు, చిత్తూరు, మచిలీపట్నం వగైరా పట్టణాలలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులు కొత్తగా ప్రారంభించడానికి అసెంబ్లీ ప్రభుత్వం అంగీకరించింది. నెల్లూరుకు సంబంధించి, డి. కె. కాలేజిలో ఇవి ప్రారంభించాలని తలపెట్టారు.

అయితే, ఆర్థిక వాయిదాలవల్ల ప్రస్తుతానికి కొద్దికాలేజీలకే ఈ అవకాశం ఇవ్వాలని, నెల్లూరుజిల్లాలో ఇప్పటికి రెండుచోట్ల పి. జి. కోర్సులు నడుస్తున్నాయికాబట్టి, డి. కె. కాలేజివిషయం వాయిదావేయాలని తలపెడుతున్నారట.

—కొరవ 10 వ పేజీలో

# శృంగారమంటేనే వణుకు పుట్టిస్తున్నది ఎయిడ్స్

(గత సంచిక తరువాయి)

ఎయిడ్స్ సోకడమనేది ఒకరినుండి మరొకరికి తామరలాగనో, తిటలాగానో, స్పర్శమాత్రానో సంక్రమించదు. జంట స్థల సిరంతిజ, సిడిల్స్: లాలాజలం, ఇంద్రియం, రక్తం వంటి శరీర ద్రవాలు వ్యాధిని మరొకళ్ళకు వ్యాపింపచేసేందుకు తోహదపడే ఉపద్రవాలు. కనుక ఈ వ్యాధి కేవలం లైంగిక సంపర్కం

**డా. జె. పి. రెడ్డి**

వల్లనే వ్యాప్తి చెందుతుందని భావించరాదు.

ఎయిడ్స్ వ్యాధి అవరించిన అభాగ్యులకు నర్సులు కూడా అంటుతుందేమో భయంతో అంటీఅంటని రీతిలోనే సేవలు చేస్తున్నారు. స్వలింగ సంపర్కమన్నా, అసలు మైధునమన్నా ఎలాంటి శృంగారమన్నా కంగారుపడిపోతున్నారు. జిగి, జిగేలుకాంతులతో వెలుగుతూవుండే నైట్ క్లబ్బులు సహితం మబ్బుల మసకేసున్నాయి: క్యాబరే నృత్యాలుకూడా మునగేసుకున్నాయి. ఈ వ్యాధిలా ప్రస్తుతం ప్రపంచాన్నంతా కలవరంతో ఊపుతున్నది. శృంగారంతో ఊద్రిక్తతనాన్ని మాపుతున్నది. మత్తుమందుల వాతకాన్ని ఆపుతున్నది. వైద్య పరిశోధకులకు మరింత లాలాస్ని, జాగృతను పెంచుతున్నది.

అమెరికాలోని "హైతి ద్వీపం" అనే ప్రాంతం శిథిలమయం, హోమో సెక్స్ వల్ల అభంకము ప్రఖ్యాతి గాంచినది. అక్కడ ఈ వ్యాధి పుట్టి ఉధృతంగా వుండటాన్నిబట్టి ఈ AIDS జననం లోనే ఎక్కువగా, ముందుగా సోకుతున్నట్లు నిర్ణయించారు.

కొన్ని ప్రాంతాలవారికి లేదా కొన్ని వ్యసనాలకు అలవాటుపడినవారికి, ఇట్లా కొన్నివర్గాల ప్రజలకే ముందుగా, ఎక్కువగా ఎందుకని ఈ వ్యాధి వస్తున్నది? అసలీ వ్యాధికి ఐవమిద్ధమైన కారణమేమిటి? వ్యాధిని నియంత్రించేందుకు ఏమి చేయాలి? ముందుజాగ్రత్తచర్యలేమిటి? నివారణ ఎట్లా? ఈ ప్రశ్నలు నేటికి ప్రశ్నలుగానే మిగిలి, ఆరోగ్య సంస్థలకు సవాలుగా తగిలివున్నాయి. ఎయిడ్స్ వ్యాధి అంటుకున్నాక, దాని తాలూకు రోగలక్షణాలు బయటికికన్పించడానికి 3 నుండి 5 సంవత్సరాలు పడుతుంది. ఇంత పొడుగాటి ఇంకుబేషన్ పిరియడ్ వల్ల, వ్యాధి ఎవళ్ళలో వున్నదో, ఎవళ్ళలో లేదోకూడా తెల్సుకోలేని మరో తిక్క పరిస్థితి ఏర్పడింది.

ఇదిట్లావుండగా, వాషింగ్టన్ లోని ఓ ఎయిడ్స్ శోధనాసంస్థ శాస్త్రవేత్తల చీకటికి వెలుగు దొరికిందని ప్రకటించింది కానీ అమందు పరిశీలనాస్థాయిలోనేవుందనీ, త్వరలోనే రావచ్చుననీ ప్రకటించింది. 'పరిశోధన' అనబడేవారి సాగరమథనం త్వరలో పూర్తవ్వాలని, అందుండి అమృతం వెలికిరావాలని.

—తరువ 8 వ పేజీలో

## నంద్యాల సబార్డినేట్ జడ్జి కోర్టులో

E. P. 96/85 O. S· 85/81

నొస్సం వాగమ్మ W/o. పుల్లారెడ్డి. అకుమళ్ల కోవెలకుంట్ల తాలూకా
—డి. హో.

1) మంగలి వెంకటపతి S/o. వెంకటసుబ్బన్న కానాల నంద్యాల తా॥
2) మంగలి పెద్దపుల్లన్న, S/o. వెంకటసుబ్బన్న గుండుపాపల గ్రామం కోవెలకుంట్ల తాలూకా 3) నొస్సం వెంగమ్మ W/o. వెంకటరెడ్డి దుర్వేశి గ్రామం నంద్యాల తాలూకా 4) కుమ్మరి శివసుబ్రమణ్యం S/o. సుబ్బరాయుడు కానాల, నంద్యాల తాలూకా కర్నూలుజిల్లా
—జె. డి. లు

ఈ నెంబరు డిక్రీ ఆయకం బాకీక్రింద ప్రిలిమినరీ డిక్రీ ఆయకం షెడ్యూలు దాఖలా స్థిరాస్తులను పై కోర్టువారి యెదుట 30-7-1988 తేది ఉదయం 10-30 మొదలుకొని పబ్లిక్ వేలం వేయబడును కొనదలచిన సవాలుదారు హాజరై వేలంలో పాల్గొని సవాలు పాడుకొనవచ్చును.

— షెడ్యూలు —

కర్నూలు డిస్ నంద్యాల తాలూకా నంద్యాల సబ్ డిస్ లో చేరిన కానాల గ్రామం పొలంలోని ఆయకం షెడ్యూలు ఆస్తుల వివరం :

(1) సర్కారు వంజ స. నెం. 1032 పైకి యు 1.50 శె. లేక 0.607 హెక్టార్లు శిస్తు 2-25 లు
(2) సర్కారు వంజ స. నెం, 1118 పైకి యు 0.60 శె. లేక 0.243 హెక్టార్ల శిస్తు రు. 0 81 లు రెండు అయిటములు కలిసి ఒకేప్లాటుగా వుండే చేనిపేరు గడ్డలమిట్ట చెక్కుబంది 1- తూ) అన్నపు రంగయ్య భూమి ప) మంగలి వెంకటపతి భూమి వు) నడిపెన్న భూమి ద) రస్తా 2 అయిటములు డి.హో మదింపు రు. 15000/-
(3) బయలు స్థలము చుట్టూ గోడలు గంది కానాల గ్రామం పంచాయితి ఏరియాలోని 3 వార్డులో వంకపక్కని బయలుకు చెక్కుబంది: తూ) ప) రస్తా, వు) కుమ్మరి సంజమ్మ కొట్టం ద) బసమ్మ బయలు స్థలము లోనైన తూ) ప) 9½ గజాలు లేక 8.69 మీటర్లు వు) ద) 10 గజాలులేక 9.14 మీటర్లు డి. హో మదింపు రు. 1500/-

పరా : ఇ.సి. లోని తగాదాలు : ఇ. సి. లోని పై షెడ్యూలు మూడవ అయిటం ఆస్తి 2వ జె.డి ఆర్ కు 26 5 65 తేది భాగపరిష్కారములో హక్కు రాబడినది గనుక ఇ.పి జాకీకి వాదించడు ఇ.సి.లో తగాదాలు లేవు.

ఎ. శేషగిరిరావు
డి.హో. తరం అడ్వకేటు

# నెల్లూరు సంగతులు

### కోటకు కోర్టు

కోటలో త్వరలో ఒక మున్సిఫ్ మేజిస్ట్రేట్ కోర్టు ఏర్పాటౌతుంది. రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి ఈ విషయం చెప్పారు. కోటలో చాలా కాలం క్రితమే కోర్టుకోసం భవనాలు కట్టి వుంచారట వాటిలో దీనిని నెలకొల్పుతారట. కోట, పరిసర గ్రామాలవారికి ఇది ఉపయోగపడుతుంది

### మండలాలకు భవనాలు

జిల్లాలో కొత్తగా 8 మండలాలకు నూతన భవనాలు కట్టారట- రెవిన్యూమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి చెప్పారు. అవి ఇవి- ఓజిలి, తిక్కిలి, సైదాపురం, కోట, తడ, ఇందుకూరి, ముత్తుకూరు దొరవారిసత్రం.

ఒక్కొక్కభవనానికి 6 లక్షలు ఖర్చు పెడతారట.

### కళాభారతి వయొలిన్

కళాభారతి సాంస్కృతిక సంస్థ ఇటీవల, తిరుమరాపల్లికి చెందిన కుమారి కల్పన అనే యువకళాకారిణిచేత వయొలిన్ కచేరి ఏర్పాటుచేసింది. ప్రముఖ సంగీత విద్వాంసుడు శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు కచేరిని సమీక్షించారు; కళాభారతి నిర్వాహకుడు శ్రీ శంకర ప్రసాద్ వందనాలు చెప్పారు.

### నేలటూరుకు సంతాపం

సంస్కృతాంధ్ర సాహిత్యాలలో అపారమైన పాండిత్యంకల్గిన వేద సంస్కృత పాఠశాల మాజీ అధ్యాపకుడు నేలటూరి కృష్ణమాచార్యులు మృతికి సంతాపంగా, వేదసంస్కృత పాఠశాలలో సభజరిగింది. ఒకరోజు స్కూలుకు సెలవు ప్రకటించారు.

### చైతన్య అకాడమీ

నెల్లూరులో- చైతన్య ఆర్ట్స్ అకాడమీ అనే సాంస్కృతి సంస్థ వుందట- వీరి ప్రథమ వార్షికోత్సవసభ 22 తేది టౌన్ హాలులో ఆడంబరంగా జరిగింది. ఇద్దరు మంత్రులు వచ్చారు- సాంఘిక సంక్షేమ శాఖ మంత్రిణి శ్రీమతి ప్రతిభాభారతి, చేనేత మంత్రి శ్రీ కాశిరెడ్డి మాట్లాడారు. సమాచారశాఖ డిప్యూటీడైరెక్టరు శ్రీ ఎం. చంద్రశేఖరయ్య అధ్యక్షించారు. కవి, రచయిత శ్రీ నాగభైరవ కోటీశ్వరరావు కార్యక్రమం నిర్వహించారు, మేకప్ ఆర్టిస్ట్ శ్రీ గోవిందు, సంగీతవిద్వాంసుడు శ్రీ ధూళిపాళ శ్రీనివాసరావులను సన్మానించారు. శ్రీ ధవెంకుల నరసింహం, ప్రతిభాభారతికి సన్మానపత్రం సమర్పించారు. అకాడమీ అధ్యక్షుడు శ్రీ మారిశెట్టి వెంకటేశ్వరరావు స్వాగతం, కార్యదర్శి శ్రీ మసుబోలు ప్రభాకరరావు వందనాలు చెప్పారు.

### నాయుడమ్మ స్మారకసభ

నెల్లూరులో సాహిత్యసభలు, సాంస్కృతిక సమావేశాలకు కొదువలేదుగానీ, సైన్సు కార్యక్రమాలనంగతి పట్టించుకునేవారేలేరు. ప్రజలలో శాస్త్రపరమైన; విజ్ఞానదాయకమైన విషయాలపై ఆసక్తి కల్పించడానికీ, శాస్త్రపరంగా నిత్యం జరుగుతున్న అభివృద్ధిని సామాన్యులకు తెలియపరచడానికిగాని ప్రయత్నించేవారే

—తరువ 8 వ పేజీలో

### డాక్టర్ల దోపిడీ

వైద్యవృత్తి [illegible] శిష్యుడు ప్రాణప్రదాత [illegible] వైద్యుడు ప్రాణరక్షకుడు. అందువల్లే మనలో అధికులు దేవుడితర్వాత వైద్యుడ్ని అధికంగా గౌరవిస్తారు; పూజిస్తారు. నేడు జనం కూడా డాక్టర్ల ఒక సమున్నత స్థానం వుంది. అభిరంతోనో, నలుగురికి తెలిసే రాజకీయవాదులు, అధికారులు మన్నన సంపాదించుకుంటే, కేవలం చదివినచదువుకే, వీరితో సమస్థాయి మర్యాద పొందుతున్నారు డాక్టర్లు ఎంతో ఉన్నతమైన విద్య నభ్యసించిన లీడర్లు, ఇంజనీర్లు, ఐకసులకంటే సామాన్య జనంలో డాక్టర్లకే ఆదరణ, గుర్తింపు ఎక్కువ.

అయితే, అదే డాక్టర్లు, సామాన్య జనాన్ని, తమ విశ్వాసను అర్థంచేసుకుని దోపిడీచేస్తున్న తీరుచూస్తుంటే, ఏ సేవాభావం విస్మృతి వుంటుందా అన్పిస్తున్నది. ముందుగానే మనవిచేస్తున్నాను- డాక్టర్లంటే నా దృష్టిలో అందరూ అనికాదు; వృత్తిని పరమపవిత్రంగా భావించేవారితో పాటే, పరమ నికృష్టవ్యాపారంగా మలచేవారూ వున్నారనిచెప్పడమే నా ఉద్దేశ్యం.

నిజానికి ఈ రెండో తెగకు చెందినవారు కేవలం వ్యాపారం చేయడంలేదు, రోగుల ప్రాణాలతో ఆటలాడుకుంటున్నారు; జలగలవలె వారి రక్తం పీలుస్తున్నారు. ప్రభుత్వ ఆస్పత్రులలో ఇటువంటి రాతిగుండె వైద్యులుండడం సర్వసామాన్యం; ఎన్ని ప్రభుత్వాలు మారినా, వారి ప్రవృత్తిలో మార్పువుండదు. కానీ ప్రైవేటు ఆస్పత్రులలోకూడా ఈ దానవత్వం ప్రబలి పోవడమే దారుణం.

ప్రభుత్వ ఆస్పత్రులలో తమ ప్రాణానికి రక్షణ లేదనే భయంతో, ఖర్చుకు కూడా వెనుకాడక ప్రైవేటు చికిత్స సిద్ధపడే రోగులను కొందరు డాక్టర్లు దోపిడీ చేస్తున్న తీరుచూస్తే, నైతిక ప్రమాణాలు ఇంతగా పతనమై పోతున్నాయా అని భయమేస్తూంది.

ఈ వైద్యవ్యాపారుల ప్రథమదోపిడీ, మందులతో ప్రారంభమౌతూంది. డాక్టర్లు తమ నర్సింగ్ హోంలలోనే మందులంగళ్ళు పెట్టుకుంటున్నారు.

# నా మాట

ఆయనదగ్గర వైద్యం చేయించుకునేవారు, విధిగా ఆ అంగట్లోనే మందులుకొనాలి [illegible] (పిప్) స్లిప్ లో వ్రాస్తున్నారు; [illegible] మందులకూ కృత్రిమ కొరతను సృష్టించి, అధికంగా ముట్టజెప్పే కంపెనీల సరుకే వుంటుంది. ప్రతిభ గలిగినవారనో, హస్తవాసి మీద గురి కుదిరో వారిదగ్గరకు వెళ్ళే రోగులను నయవంచనతో దోచుకుంటున్నారు వీరు,

ఇంకొందరు డాక్టర్లకు అంగళ్లుండవు.

**డోలేంద్ర**

కాని కంపెనీలలో ఒప్పందాలువుంటాయి. ఫలానిమందు, ఫలాని మొత్తానికి అమ్మిపెడితే ఫలాని బహుమతి అని; ఈబహుమతులు ప్రెషర్ కుక్కర్లనుంచి ప్రీమియర్ పద్మిని కార్లవరకుకూడా వుంటాయి. ప్రెజెంటేషన్లపైనే ఆశ అందాం కక్కుర్తిలో ఈ తరహా డాక్టర్లు రోగుల రోగాలతో ఆటలాడుతున్నారు. సాధారణజ్వరం వంటి జబ్బులు, టానిక్కుల విషయంలో ఈ తరహా దోపిడీ అధికం. డబ్బు మోజుతో వీరెంత నీచానికి దిగజారుతున్నారంటే, అవసరమున్నా లేకున్నా, ఈమందులు అబ్బిడి ముబ్బిడిగా వ్రాస్తున్నారు; అవి పరిశీలించినా పట్టించుకోవడంలేదట.

ఇంకో తరహా డాక్టర్లున్నారు - వీరికి కొన్ని లేబరేటరీలలో భాగమో, కమీషన ఒప్పందమో వుంటుందట. అవి వున్నవారు రక్తపరీక్ష దారులను వాటికే పంపిస్తారు. అంత వరకైతే ఫర్వాలేదు. అవసరం లేనివారికికూడా పరీక్షలు ప్రెస్క్రైబ్ చేస్తారట. అటువంటి కాగితాలపై చుక్కల కోడ్‌లు వుంటాయట. రోగి ఆ కాగితం తీసుకుని రాగానే, లేబరేటరీలతో పరీక్ష చేసినట్లు నటించి, డబ్బు గుంజతారట. ఆ మొత్తం చెరిసగం పంచుకుంటారట. ఎంత నీచమో చూడండి.

—తరువ 11 వ పేజీలో

# ఊరికొక్క గ్రంథాలయం- ఎవరిని ఉద్ధరించడానికి?

జిల్లాలో కొత్తగా 28 గ్రంథాలయాలు మంజూరుచేసింది ప్రభుత్వం. మండలానికొక గ్రంథాలయం ఉన్నవిధానంలో మంజూరైనాయి అవి. ఇదివరకు జిల్లాకే 3 గ్రంథాలయాలు మంజూరై వుండినాయి అంటే మొత్తం 31 గ్రంథాలయాలన్నమాట. అవి ప్రారంభమైతే, గ్రంథాలయంలేని మండల ప్రధాన కేంద్రమే వుండదు.

కొత్తగామంజూరైన గ్రంథాలయాలివి- దుత్తలూరు, దక్కిలి, సీతారామపురం, పొదలకూరు, సైదాపురం, చిట్టమూరు, దొరవారిసత్రం, ముత్తుకూరు, ఇందుకూరుపేట, అనంతసాగరం, అనుమసముద్రంపేట, జలదంకి, బోగోలు, వెంకటాచలం, మనుబోలు, వాకాడు, కలిగిరి, సంగం, కోట, కొడవలూరు, తడ, బాలాయపల్లె, వరికుంటపాడు, మర్రిపాడు, కొండాపురం, దగదర్తి, చేజర్ల, తోటపల్లిగూడూరు, చిట్టమూరు, పెళ్ళకూరు, ఓజిలి, చిల్లకూరు.

జిల్లా గ్రంథాలయ సంస్థ ప్రారంభమై దాదాపు 30 సంవత్సరాలైతే, ఇప్పటికి కేంద్రగ్రంథాలయంతో సహా 30శాఖలు మాత్రం నెలకొల్పగల్గారు; ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు ఒకే ఒక్క కలం పోటుతో 31 శాఖలు కల్పించగల్గారు. ముప్పయ్యేళ్ళలో సాధించిన అభివృద్ధిని ఒకేఒక్క నెలలో సాధించడం నిజంగా గొప్పవిషయమే! గ్రంథాలయోద్యమాన్ని

## జిల్లావార్తలు

గ్రామ గ్రామాన విస్తరింపచేయాలనే సత్సంకల్పం ప్రభుత్వానికి కల్గడం హర్షణీయమే.

అయితే నెల్లూరుజిల్లా గ్రంథాలయ సంస్థకుమాత్రం ఇది ఎటుచూసినా వాపే కాని, బలుపుగా కన్పించడంలేదు. ఒక్కసారి ఇంతపెద్ద భారాన్ని ఎట్లామోయాలో తెలియక తల్లిబ్బు తడుతున్నట్టున్నారు వారు. నిజానికి ఆ సంస్థ ఆర్థికస్తోమత ఇప్పుడున్న 30 శాఖల నిర్వహణకు బొటాబొటిగా సరిపోతుందట. ఉచిత భవనాలిచ్చి, ఉద్యోగుల జీతభత్యాలు ప్రభుత్వం భరించగలిగితే, మరొక నాలుగైదుశాఖలను అదనంగా నడిపించగలరట అటువంటిది ఒక్కసారి 31 అదనపుశాఖలను నిర్వహించడమంటే - అలివయ్యేపనేనా?

అదీగాక, కొత్తగా మంజూరైనవాటిలో ఆరేడింటికిమాత్రమే ఉచితంగాకాని, బాడుగకుకాని ఇళ్ళుదొరికే అవకాశాలున్నాయట. దొరవారిసత్రం వంటి మండలాలలో ఎం. ఆర్. ఓ. ఆఫీసులకే ఇళ్ళుదొరకలేదు; ఇక లైబ్రరీలకు బాడుగకిచ్చేవారెవరు?

ఒకవేళ బాడుగకు దొరికినా, వీటన్నింటినీ భరించే స్తోమత వీరికి వుంటనుకాక వుండదు. ఇప్పుడుండే భవనాలలోనే అధికభాగం శిథిల స్థితిలో వున్నాయి. వాటన్నింటినీ రిపేరు చేయించడానికి వీరిదగ్గర సొమ్ములేదు; సొమ్ము సేకరించగల్గినా, ఆర్ అండ్ బి ఇంజనీర్లలో ఉలుకు, పలుకు వుండదు. కూలిపోయిన ఒకటి రెండు భవనాలను పునర్నిర్మించడానికి సంవత్సరాల తరబడి ఆర్అండ్బి అధికారులచుట్టూ తిరుగుతున్నా, ఫలితం లేని సాదృశ్యాలు చాలానే వున్నాయట.

ఇళ్ళదొక సమస్య అయితే, పుస్తకాలది ఇంకా పెద్ద సమస్య. వున్నవాటికే చాలినన్ని పుస్తకాలులేవు. ఆ మధ్య ప్రభుత్వ నిషేధంవల్ల వరుసగా రెండేళ్ళు అసలు ఒక్క పుస్తకంకూడా కొనలేదట. గ్రంథాలయసంస్థకు ఇప్పుడున్న నిధుల వనరులతో ఇన్ని లైబ్రరీలకు క్రమం తప్పకుండా ఏటా పుస్తకాలు సరఫరా చేయడమన్నది అసాధ్యమైన విషయం. పుస్తకాలసంగతి దేవుడెరుగు- కనీసం దిన, వారపత్రికలైనా పాఠకుల తృప్తిమేరా సరఫరా చేయగలరా అన్నదికూడా సందేహమే!

శుభమా అని కొత్తగ్రంథాలయాలు వస్తుంటే అపశకునం పల్కడంకాదుకాని, ఈ కొత్తలైబ్రరీలు ప్రజలకు ఏరకంగా ఉపయోగపడ్తాయని ఆశించలేము. అన్నగారు వీటికి 'తెలుగు విజ్ఞాన సమాచార కేంద్రాలు' అని నామకరణం చేశారు. గ్రంథాలయాలుగానేకాక, ప్రభుత్వ కార్యక్రమాల ప్రచారకేంద్రాలుగాకూడా వీటిని ఉపయోగించడం ప్రభుత్వ అభిమతమట. ఆ దృష్టితో చూసినట్లైతే, అన్నగారి ఘనకార్యాల బాకా ఊదడానికి, తెలుగుదేశం ఘనతను ఊదరగొట్టడానికి ఇవి బాగానే ఉపకరిస్తాయనుకుంటాము.

బహుశా ప్రభుత్వం, కొత్తలైబ్రరీలు మంజూరుచేసి చేతులు దులుపుకోబోతుంది; అంతగా అయితే అన్నగారి బొమ్మలు, ఉపన్యాసాల పుస్తకాలు దండిగా సరఫరా చేస్తుందేమో! అంతటితో సరిపెట్టుకుంటే, ఇవి ప్రారంభమైకూడా దంతగొడతాయి. అందువల్ల ఆయా గ్రామాల ప్రజలే ముందుకువచ్చి, లైబ్రరీలకు భవనవసతి కల్పించడానికి, ఇతర సౌకర్యాలు సమకూర్చుకోడానికి స్వంత ప్రయత్నాలు చేసుకుంటే, ఈ గ్రంథాలయ శాఖలు సక్రమంగా నడుస్తాయి; ప్రభుత్వాన్ని నమ్ముకుంటే, శిథిల దేవాలయాలే అవుతాయి.

### ఆత్మకూరు చోరీలు

ఆత్మకూరులోని బస్టాండు చోరులకు నిలయమైపోయింది. ఏమాత్రం పరధ్యానంగా నిలబడినామా, సైగా జేబుకత్తిరించుకపోతున్నారు. మొన్న, ఎహమ్మద్‌భాషా అనే హైస్కూలు టీచరు

-కొరవ 7 వ పేజీలో






# డి జి పి స్వాగతానికి ఎంత ఆడంబరమో..!

కరకుతనానికి, కాఠిన్యానికి పోలీసుల పెట్టిందిపేరని తెలుసుకాని, వారిలో కూడా కళాప్రియత్వం, రసజ్ఞత వుంటాయని, మొన్న డిజిపి సభలు చూసిందాకా తెలియదు. రాష్ట్ర డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు శ్రీ సి. జి. సల్దానా 1 తేది నెల్లూరుకువస్తే, జిల్లా పోలీసు యంత్రాంగం చేసిన హడావుడి, ఆర్భాటం, జరిపిన సంబరాలు, ఆడంబరాలు చూస్తే అబ్బా అన్పించింది.

పైగా కార్యక్రమాలేవీ పెద్దవికావు. మూలపేటలో పోలీసు గృహసముదాయానికి శంకుస్థాపన; ఆత్మకూరు బస్టాండు, వి ఆర్. కాలేజి సెంటర్లలో ఆటోమేటిక్ ట్రాఫిక్ సిగ్నల్సు స్విచ్ ఆన్- ఇవే కార్యక్రమాలు, ఎస్. పి. గారు ఈ మూడు సభలనూ అత్యంత కళాత్మకంగా నిర్వహించారు. మరీ మూలపేటలో అయితే అది సభావేదికా లేక శోభనంగదా అని సందేహం కల్గింది. సువాసన ఘుబాళించే రంగురంగులపూలతో, అంత అందంగా అలంకరించారు వేదికను. సాధారణంగా అత్యున్నతస్థాయిలోవుండే వారిని రెడ్‌కార్పెట్‌తో స్వాగతిస్తారు; కాని మన ఎస్. పి. మాత్రం డిజిపిని మంగళ తోరణాలు కట్టించి, తెలుగు సాంప్రదాయ రీతిలో స్వాగత ఏర్పాట్లు చేశారు. పోలీసు లైన్సునుంచి దారికిరువైపులా తచ్చలి తెంకాయ ఆకులతో స్తంభాలు నాటి, మామిడితోరణాలు వ్రేలాడదీయించారు. పైగా వేదోక్తమైన, మంగళాశీర్వ

-కొరవ 7 వ పేజీలో

## నంద్యాల సబార్డినేటు జడ్జి కోర్టులో

E. P: 97/85 O. S. 86/81

నొస్సం నాగమ్మ, W/o. పుల్లారెడ్డి అకుమళ్ళగ్రామం కోవెలకుంట్ల తాలూకా
-వాది

(1) మంగలి వెంకటపతి S/o. వెంకటసుబ్బన్న
(2) నొస్సం వెంగమ్మ W/o. వెంకటరెడ్డి. దుర్వేశి గ్రామం
(3) కుమ్మిత శివసుబ్రమణ్యం S/o. సుబ్బరాయుడు
(4) పటాల ఖాదర్‌సాహెబ్ S/o. మోదీన్‌సాహెబ్
(5) పటాల రసూలుబీ W/o. ఖాదర్‌సాహెబ్
(6) కమ్మరి పెద్దజమాల్‌సాహెబ్ S/o. జమాల్‌సాహెబ్ పోలూరు గ్రామం నంద్యాల తా॥ 7) కమ్మరి చిన్నజమాల్‌సాహెబ్ S/o. జమాల్‌సాహెబ్ 1, 3, 4, 5, 7, యినములు కానాల గ్రామం నంద్యాల తాలూకా కర్నూలు జిల్లా
జె.డి.ఆర్.లు

ఈ నెంబరు డిక్రీ ఆయకం బాకీక్రింద జె.డి.లు తాలూకు ప్రిలిమినరీ ఆయకం డిక్రీ షెడ్యూలు ఖాళలా స్థిరాస్తులను పై కోర్టువారి యెదుట 30-7-1986 తేదిన పగలు 10-30 గంటల నుండి పబ్లిక్ వేలం వేయబడును కొనదలచిన సవాలుదార్లు వాయిదా దినం హాజరై వేలం పాడుకొనవచ్చును.

— షెడ్యూలు —

కర్నూలు డి॥ నంద్యాల సబ్ ॥డిలో చేరిన కానాల గ్రామం పొలంలోని ప్రిలిమినరీ డిక్రీ ఆయకం షెడ్యూలు స్థిరాస్తుల వివరం :

1) స. నంజ స.నెం. 1032 పైకి యు 1-50 ఎ. లేక 0.607 హెక్టార్స్ శిస్తు రు. 2-40 చేనిపేరు గద్దలమిట్ట చేను. తూ) మంగలి చిన్నపుల్లన్న భూమి ప) బుస్సమ్మ భూమి వు) నదిపెన్న భూమి ద) నీటికాలువ
డి.హో. మదింపు 10.000/-

2) స నంజ స.నెం 1032 పైకి యు 0.80 ఎ. లేక 0.324 హెక్టార్స్ శిస్తు రు. 6-75 చేనిపేరు గద్దలమిట్ట చేను తూ) శేటు మంగలి చిన్నపుల్లన్న భూమి ప) మంగలి చిన్నపుల్లన్న భూమి వు) భజంత్రి బుస్సమ్మ భూమి ద) పంటకాలువ, రస్తా,
డి.హో. మదింపు రూ. 6000/-

3) కానాల గ్రామం పంచాయితి ఏరియాలోని యింటి వివరం : కానాల పంచాతి ఏరియా వీధి నం.2 ఇంటి నం. 12 చెక్కుబంది :
తూ) మసీదు ప) రస్తా, వు) చాకలి సుద్దులేటి యిల్లు ద) భజంత్రి బుస్సమ్మ యిల్లు ఈ దిశలకు లోబైన తూ) ప) 10½ గ. లేక 9-50 మీ, వు) ద) 7½ గ. లేక 6.83 మీ. గల మిద్దె యిల్లు మూడు అంకణములు గల పడమటి దిశ తలవాకిలిగల యిల్లు
డి.హో. మదింపు రూ. 2000/-

షరా : ఇ. సి లోని తగాదాలు :

పై షెడ్యూలు 1, 3 అయిటములు 2 డి ఆర్ 1 కు 26-5 65 తేదిన భాగపరిష్కారం దస్తావేజురీత్యా హక్కు రాబడి దాఖలుపడి వుండియు 2వ అయిటం 21-6-68 లో పెద్దనాగన్న, చిన్ననాగన్న గార్లతో 1వ జె డి ఆర్ విక్రయించుకున్న భూమి గాన 3 డి ఆర్ కు హక్కు రాబడి గమనిక 1 to 3 అయిటములకు ఇ సి లోని తగాదాలు బాధించవు. ఇ సి లోని 4-5-65 తేదిన రు. 2000/-కు నెల 1-కి 100-కి రు. 0-50 ప్రకారం 2 డి ఆర్ వుంచిన ఆయకం బాకీ తీరిపోయినది. వసూళు బాధించవు ఇ సి లో ఏలాటి తగాదాలు లేవు.

ఎ. శేషగిరిరావు
డి.హో. వరం అడ్వకేటు నంద్యాల

# తెరపై బాలకృష్ణ పల్టీలతో స్లాబ్ పద్ధతి రద్దవుతుందా?

భారీబడ్జెట్టుక తయారయ్యే చిత్రాలకు తప్ప చిన్నతారాగణంతో లోబడ్జెట్లో తీసే చిత్రాలకు స్లాబ్ సిస్టమ్ వల్ల ఏమాత్రం ప్రయోజనం వుండదు. ఈ విషయమై ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుకి చిన్న నిర్మాతలెందరో విన్నపాలు చేసుకున్నారుకూడా. అవన్నీ చెవిటివాని చెవిలో శంఖం వూదినట్లయిపోయాయి. ఎన్. టి. రామారావు పుత్రుడు బాలకృష్ణ నటించే చిత్రాలన్నీ బిగ్ బడ్జెట్లో తయారయ్యేవే అందేత, ఆ నిర్మాతలకు లాభించవచ్చని ఎన్. టి. రామారావు వూహించుకుంటూవచ్చారు. కాని, బాలకృష్ణ నటించిన చిత్రాలు రెండో మూడో తప్ప మిగతావేవీ హిట్సు అవలేదు, అందేత, నిర్మాతలకు ఈ స్లాబ్ విధానంలో ఆశించినంత లాభాలు రావడం లేదు. ఇది ఇలావుండగా అక్కినేని నాగేశ్వరరావు పుత్రుడు నాగార్జున నటించిన తొలిచిత్రం "విక్రమ్" సూపర్ హిట్ అయి, కొనుగోలుదారులకుకూడా విపరీతమైన లాభాలు తెచ్చిపెట్టింది. ఇది ఎన్. టి. రామారావుకి కన్నుకుట్టినట్టయింది కాబోలు: ఇప్పుడు స్లాబ్ సిస్టమ్ ఉండాలా-వద్దా అనేవిషయమై కొందరితో చర్చలు సాగిస్తున్నారట.

స్లాబ్ సిస్టమ్ తొలగించడం అంటూ జరిగితే, అత్యధికవ్యయంతో తయారయ్యే భారీచిత్రాల సంఖ్య తగ్గుతుంది. చిన్న బడ్జెట్ చిత్రాలకు ప్రోత్సాహంలభిస్తుంది. ఎటొచ్చీ ఈ స్లాబ్ సిస్టమ్ సీజన్ లో రేట్లు అమాంతంగా పెంచేసిన తారలు తమ రేట్లను తగ్గించుకోడానికి ఒకపట్టాన ఇష్టపడరు. నిర్మాతలకు ఏంచేయాలో తోచనిపరిస్థితి ఏర్పడుతుంది.

మా మద్రాసు
సినీప్రతినిధి

## పాత్రికేయులతో ఎం. ఎస్. రెడ్డి గోష్ఠి

ప్రముఖ నిర్మాత, సహజ కవి మల్లెమాల సుందరరామిరెడ్డి జూన్ 23 రాత్రి మద్రాసు సవేరాహోటల్ లో పాత్రికేయుల సమావేశాన్ని ఏర్పాటుచేశారు. ఇందుకు రెండు కారణాలున్నాయి. ఈయన సమర్పణలో ఈయన పుత్రుడు శ్యాంప్రసాద్‌రెడ్డి నిర్మించిన ఎం. ఎస్. రెడ్డి మూవీస్ "తలంబ్రాలు" చిత్రం 22 రోజుల్లోనే హైదరాబాదులో పూర్తయింది. ఈరోజుల్లో ఇది చాలాఅసాధారణం, అసాధ్యమైన విషయం. ఒక ప్లాను ప్రకారం చిత్రనిర్మాణం కొనసాగిస్తే, విజయవంతం కావడం ఏమంత కష్టం కాదని శ్యాంప్రసాద్‌రెడ్డి నిరూపించారు. ఇది మరికొందరు నిర్మాతలకు ధైర్యమిస్తుంది. పైగా, ఈచిత్రాన్ని జిల్లాలవారీగా విక్రయించకుండా ఇదివరకటిలా పంపిణీదారులద్వారా విడుదల చేయించడం మరోవిశేషం. రామోజీరావుగారి 'మయూరి' ద్వారా విడుదల చేయబడుతుంది. ఈచిత్రంలో భారీతారలు లేరు. డాక్టర్ రాజశేఖర్, జీవిత నాయకానాయకులు. జీవిత పలుతమిళచిత్రాలలో నటిస్తున్న తెలుగువనిత. ఈమెను తెలుగు చిత్రపరిశ్రమకు పరిచయంచేసిన ఘనత ఎం. ఎస్. రెడ్డికి దక్కింది. ఈచిత్రానికి కోడి రామకృష్ణ దర్శకుడు.

జూన్ 23 ఉదయం ఎం. ఎస్. రెడ్డి స్వయంగా నిర్మించే కౌముదీ పిక్చర్స్ "ఒకప్రేమకథ" చిత్రానికి ప్రారంభోత్సవం జరిగింది. శ్రీ మాలకొండారెడ్డి కెమెరాస్విచ్ ఆన్‌చేయగా, ప్రముఖ రచ

—కొరవ 11వ పేజీలో

## డ్రస్సులు మారిస్తే చాలా?

ప్రముఖ మరాఠీ చిత్రనిర్మాత, దర్శకుడు, రచయిత హీరో అయిన దాదా కోండ్కే అందగాడు కాదు. యువకుడు కాదు. చిత్రమంతా కేవలం నిక్కరు బనీనుతోనే కనిపిస్తాడు. అతని చిత్రాలు రజితోత్సవాలు జరుపుకుంటాయి. కారణం ఏమిటంటే మంచికథను రూపొందిస్తాడు, రాజకీయ నాయకులపై చెణుకులు విసిరే సంభాషణలు వుంటాయి. "ఈ హిందీ హీరోలందరూ ప్రతి సీనులోనూ ఒక్కోకొత్తడ్రస్‌లో కనిపిస్తారు. డ్యూయెట్ సాంగ్సులో అయితే ఎన్నిదుస్తులు మారుస్తారో! నేను వొట్టి నిక్కర్ బనీన్‌తోనే చిత్రమంతా కనిపిస్తాను. ఏ కొమ్ములు తిరిగిన హీరో అయినా నాలాకనిపించి, నటించి, పిక్చర్‌ని సూపర్‌హిట్ చేయమనండి చూద్దాం" అని ఇటీవల సవాల్ చేశాడు దాదాకోండ్కే.

నిజమే. మన హీరోలు కథ, అందులోని తమపాత్రలు, నటనకన్నా డ్రెస్‌ల మీదే ఎక్కువగా దృష్టిని కేంద్రీకరిస్తారు. కొన్నివేలు ఖరీదుచేసే, బొంబాయినుంచి దుస్తులు తెప్పించమంటారు. హీరోయిన్ అయితే మరీనూ. చిత్రం పూర్తయ్యాక ఆ కాస్ట్యూమ్స్‌ను తమ ఇంటికి తీసుకెళ్ళిపోవడమూకద్దు.

హీరో హీరోయిన్‌ల దామినేషన్ అంతకంతకు ఎక్కువవుతుండడంవల్ల నిర్మాతల పరిస్థితి నానాటికీ అధ్వాన్నమైపోతోంది. ఆఖరికి హీరో రిక్షాలాగేవాడి పాత్ర ధరించినా టెర్రిలిన్‌దుస్తులు కావాలంటారు, ఇతర దుస్తులలో కనిపిస్తే, తమ అభిమానసంఘాలవారు బాధపడతారంటారు.

ఎంత ఖరీదైన దుస్తులు కుట్టించినా, కేవలం కాస్ట్యూమ్‌వల్ల చిత్రం విజయవంతం కాగలదా? ★

## జయప్రద ఒక ఇంటి ఇల్లాలైంది!

ఆడవారి మాటలకు అర్థాలు వేరులే- అన్నారు. జయప్రద విషయంలో అదే నిజమైంది. "మీరు శ్రీకాంత్ నహతాను వివాహం చేసుకోబోతున్నట్లు కొన్ని బొంబాయి పత్రికలు ప్రచురించాయే?" అని ఏకాదిక్రికం జయప్రదను అడిగితే, "ఛీ-ఛీ! అతనితో నాకేమిటి వివాహం? ఈ పత్రికలవాళ్ళకేంపనిలేదు. తమపత్రికలు అమ్ముడవడంకోసం తరచు ఇలాంటి సంచలనవార్తలు సృష్టిస్తుంటారు. అసలు నాకు ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకోవలసిన అవసరం ఏముంది? చేసుకున్నా- ఇదివరకే వివాహితుడై, ఇద్దరుపిల్లలతండ్రిని చేసుకునేంతకర్మ నాకేంపట్టింది?" అంది. అటువంటామె జూలై 23 న బొంబాయిలోని ఒక ఫైవ్‌స్టార్ హోటల్లో శ్రీకాంత్ నహతాను వివాహంచేసుకుంది. ప్రముఖ నిర్మాత సుందర్‌లాల్ నహతా పుత్రుడు శ్రీకాంత్ నహతా- ఇతడుకూడా చిత్ర నిర్మాతే.

శ్రీకాంత్‌నహతా మొదటిభార్య పాపం తనభర్త మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడన్న పిడుగులాంటి వార్త చెవినిపడడంతోనే తల్లడిల్లిపోయిందట.

'విజృంభణ'లో అనూరాధ

రాఘవేంద్రరావు చిత్రాల దిగ్విజయ యాత్రకు స్పీడ్ బ్రేకర్

## రావణబ్రహ్మ

తెలుగు చలనచిత్రరంగాన్ని ప్రస్తుతం ఏలుతున్న, కాసిస్తున్న కొద్దిమంది ప్రముఖులలో దర్శకుడు కె. రాఘవేంద్రరావు ఒకడు. ఇది ఆయన యుగమని కూడా ప్రచారం చేసేవాళ్ళు లేకపోలేదు. నిజమే! అడవిరాముడు నుండి వజ్రాయుధం వరకు ఆయన చిత్రాలు చాలవరకు విజయవంతమై, జనాదరణ పొందాయి. ఎనలేని కీర్తిని సంపాదించి పెట్టాయి. తద్వారా ఆయనకు చిత్రరంగంలో ఒక సముచితస్థానం ఏర్పడింది. ప్రేక్షకుల నాడిని తెల్సుకొని, నవరసాలను మేళవించి, చిత్రాన్ని విజయవంతం చేయడంలో ఆయనేసాటి అనేవారు, ఆయన చిత్రంలో వుండవలసిన హంగులన్నీ సమపాళ్ళలో వుంటాయని ప్రేక్షకుల నమ్మకం.

ఆ నమ్మకాన్ని వమ్ముచేసింది తాజా చిత్రం 'రావణబ్రహ్మ': రాఘవేంద్రరావు చిత్రదిగ్విజయయాత్రలో ఈచిత్రం ఒక 'స్పీడ్‌బ్రేకర్' వంటిదని చెప్పొచ్చు. చిత్రం పేరుమాత్రం గొప్పగావుంది. అయితే పేరుకు, కథకు సంబంధమేలేదు

బ్రహ్మనాయుడిని రావణబ్రహ్మ అని పిలుస్తుంటారు. అతను నీతి, నిజాయితీ,

ఎల్. వి. రావు

క్రమశిక్షణ, ధైర్యంగల పోలీసాఫీసరు. గోవర్ధనరావు అక్రమాలను నిరూపించి జైల్లో పెడతారు. అతను తప్పించుకుంటాడు. బ్రహ్మనాయుడు గీతను ప్రేమిస్తాడు. గోవర్ధనరావు అనుచరుడు శ్యాంబాబు మోసంతో గీతమెడలో తాళికడతాడు. అత్మరక్షణకొరకు గీత కొందరు దుండగుల్ని చంపుతుంది. పోలీసు ఆమెను అరెస్టు

—కొరవ 11వ పేజీలో

# పంచాయతీ రాజ్యాలు

(3వ పేజీ తరువాయి)

రెడ్డి పాలెం- వాకాటి కమలారెడ్డి. వింజమూరు- గొట్టిపాటి కొండపనాయుడు. ఉదయగిరి- పి. చెంచురామయ్య. సూళ్ళూరుపేట- ఎల్లసిరి రామకృష్ణారెడ్డి. టి. ఎస్. రామిరెడ్డి ఉలవపాడు- రెడ్డి రామకృష్ణారెడ్డి. తాళ్ళూరు- పెట్ల చెంచయ్య. కలిగిరి- పన్నెం దయ్యానాయుడు. కొండాపి-గుండవరపు పట్టాభిరామస్వామిచౌదరి. తర్లుపాడు- గాదిపాటి మహానంద కొండపనాయుడు ... ... కుంచె వెంకట సుబ్బయ్య వింజమూరు. సమితి అధ్యక్షు లయ్యారు.

1964-1970 సమితి ఎన్నికల మధ్య జిల్లా రాజకీయాలలో విప్లవకరమైన మార్పు వచ్చింది. ముఖ్యంగా పంచాయతీ రాజ్య వ్యవస్థమీదకాని, కాంగ్రెస్‌సంస్థ మీదకాని, జిల్లారాజకీయాలమీదకాని ఒకటంతేని సార్వభౌమాధికారాన్ని చెలాయించిన ఆనంభవంశాధిపత్యానికి విఘాతం ఏర్పడింది: వారికి వ్యతిరేకంగా వరెత్తు మాట అనడానికి భయపడేవారు వారిని బహిరంగంగా ఎదిర్చి నిలవడానికి తయారయ్యారు. ఇదొక పెద్దమార్పు. దీనికి కారణం తమ అంతరంగికుడుగావుండి, చెంచురామానాయుడుగారిని కాదని తాము జి. ప. ఛైర్మన్‌ను చేసిన నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి 1964 ఆగస్టులో ఛైర్మన్ అయితే, 1965 డిసెంబర్‌లో ఆనంవారిమీద తిరుగుబాటు బావుటా ఎగురవేశారు. ఆనంవారిమీద అక్కసు పెంచుకొని అవకాశంకోసం ఎదురు చూస్తుండినవారందరూ పెంపింపు చంద్రశేఖరరెడ్డి జెండాక్రింద చేరిపోయారు. ఎదురులేకుండా వుండిన ఆనంవారి ప్రాభవానికి తగిలిన మొదటి పెద్దదెబ్బ అది-

అనాడు ఆనం సంజీవరెడ్డి- నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి యువనాయకులు. ఒకరినివిడిచి ఒకరు వుండేటిలేదు. అది అభినుగాని, వర్కుంగాని, ఒకరైనాగా 'ఒకరంటే ఒకరు ప్రాణంగా' వుండేవారు. జి. ప. వైస్‌ఛైర్మన్‌గా పాదిలేటి వెంకటస్వామిరెడ్డిని పెట్టుమని ముఖ్యమంత్రి అయిన నీలం సంజీవరెడ్డిగారి ఆదేశాన్ని తిరస్కరించి చంద్రశేఖరరెడ్డినిచేయగలిగిన ధైర్యం, బలం, పట్టు జిల్లాలో 1969 నాటికే ఆనం సంజీవరెడ్డి సంపాదించారు అర్థమౌతేది, జిల్లాపరిషత్తు తనచేతికొచ్చిన 1964 నాటికే ఏ.సి. సుబ్బారెడ్డికికూడా కాదనగలిగిన సుస్థిరస్థానాన్ని తెలుగొల్పుకోగలిగారు. 1965 లో చంద్రశేఖరరెడ్డికి ఏదో మంచిబుద్ధిపుట్టి చీలిపోబట్టి సరిపోయిందిగాని లేకుంటే జిల్లా రాజకీయాలు ఏరూపంలో వుండి వుండేవో, ఏ పరిణామాన్ని పొంది వుండేవో చెప్పలేము.

1970 ఎన్నికలు వచ్చేటప్పటికి ఏ.సి. దివంగతుడుకాగా, సంజీవరెడ్డి మంత్రియై, 1965-66 లో సంభవించిన తిరుగుబాటు నష్టాన్నుండి తేరుకొని, బలాన్ని పుంజుకొని, తమను వెన్నుపోటు పొడిచినవారిమీద పథకం ప్రకారం ప్రతీకారం తీర్చుకునేస్థితికి వచ్చారు. మొదటగా నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిని జి. ప. ఛైర్మన్‌గా పెరికేసి, ఆ కాంగ్రెస్ నుండి ఈ కాంగ్రెస్‌లోకి అప్పుడేదూకిన తనకేనాడూ విహితుడుకాని శ్రీ మేనకూరు గోపాలకృష్ణారెడ్డిని ఛైర్మన్‌ను చేశారు. ఆత్మకూరు, సూళ్ళూరుపేట, గూడూరు, కోవూరు, బుచ్చి, వింజమూరు, వెంకటగిరి వగైరా సమితులన్నిటిలో అధ్యక్షులను మార్చిపారవేశారు: పాతవారి స్థానంలో కొత్తవారిని పెట్టుకున్నారు. ఎం. ఎల్. సి లు వగైరా అభ్యర్థిత్వాల విషయంకోకూడా సంజీవరెడ్డి ఇటువంటి ప్రతీకారేచ్ఛతోనే వ్యవహరించాడు. "సంజీవరెడ్డిది పాముపగరా" అనిపించుకున్నాడు కాని ఏది శాశ్వతం? ఎవరు శాశ్వతం? ఏ రంగంలోనైనా అనుభవం మీద కలిగే జ్ఞానం ఇది!

## "స్కౌండ్రల్"!

ఐ. ఏ. ఎస్. అధికార్లకు పోటి పొగరు అని ప్రజలనుకుంటారు. అది కొందరి విషయంలో నిజమే ననుకోండి. మంత్రులు ఎంతకు తక్కువేమీకాదు. పాత ఐ.ఏ.ఎస్. ఆఫీసర్లు పరుషంగా మాట్లాడేవారు కాదు; కాని పాత మంత్రులు మాత్రం తమ అధికార అహాన్ని బహిరంగంగానే ప్రదర్శించేవారు.

1964 లో ప్రణాళికా మంత్రిగా డాక్టర్ మర్రి చెన్నారెడ్డి నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి సమేతుడై జిల్లాలోని సమితులన్నీ పర్యటించారు, వింజమూరు సమితి బి. డి. ఓ. బదలీ గావింపబడితే, ఆడిట్ జరుగుతున్న కారణంగా సమితి అధ్యక్షుడు అది పూర్తి అయ్యేవరకు అతన్నే వుంచమంటే కలెక్టరు వుంచాడట ఆ బి.డి.ఓ. స్వతంత్రపార్టీ వ్యక్తి అని చెన్నారెడ్డిగారికి ఎవరో చాడీలుచెప్పినట్టున్నారు. ఇకనేముంది శివమెత్తి బహిరంగసభలోనే ఆ బి.డి.ఓ.ను Scoundral అన్నాడట; అది చాలక వేదికమీదకి పిలిచి మర్లి చీవాట్లు పెట్టారట

బి. డి. ఓ. తో సరి పెట్టుకోలేదు; కలెక్టరునుకూడాదూషించాడు గదా- Who is that dirty Collector to give permission అని!

ఆ బి. డి. ఓ. శ్రీ నాగేశ్వరరావు, ఆకలెక్టరు శ్రీ ఎం.వి.రాజగోపాల్; ఇంత సభ్యతలేని చెన్నారెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రిత్వం నెరపాడుగదా!

3-7-1964 తేది బుచ్చిరెడ్డిపాలెం పార్కు ప్రారంభోత్సవసభలో మాట్లాడుతూ ఆనం సంజీవరెడ్డిగారన్నారు. "ఏదో ఒరగబెడుతుందనుకున్న పంచాయతీరాజ్యం అవినీతితో, అక్రమాలతో అవహేళనపాలైంది. ఈ అవహేళన తప్పించడానికి అభ్యుదయవాదియైన డాక్టర్ చెన్నారెడ్డి పంచాయతీ ఎన్నికలు జరిగినరోజే సమితి ఎన్నికలుగూడా జరగాలని, సభ్యులందరూ ఓటువేయాలని ప్రతిపాదించారు. కాంగ్రెస్ పార్టీలో కొందరి వ్యతిరేకతవల్ల అది సాధ్యం కాకుండా పోయింది".

సంజీవరెడ్డిగారు చెప్పింది ఒకటి నిజమే. ఎన్నికలు జరిగిన క్షణంలోనే పంచాయతీ అధ్యక్షులను అంతులేకుండా చేసేవారు: వారికి రాచమర్యాదలు జరుపుతూ, పెద్దపెద్ద నగరాలు త్రిప్పుతూ సరిగ్గా సమితి ఎన్నిక సమయానికి ఆఫీసు ముందు దించేవారు; ఈలోగా వారి అడ్రసే దొరికేదికాదు! దీనివల్ల కొనుగోళ్ళు. ఇతర లావాదేవీలు సజావుగా జరిగిపోయేవి. లక్షలున్నవాడే సమితి అధ్యక్షుడు కావడానికి వీలుండేది. 1981 తో అంజయ్య ప్రభుత్వం కట్టుకుని ప్రత్యక్ష ఎన్నిక ప్రవేశపెట్టిందాకా ఈ అవినీతి, అక్రమం కొనసాగింది.

చెన్నారెడ్డిగారిని అభ్యుదయవాదిఅని సంజీవరెడ్డి ప్రశంసించడం న్యాయమే! ఎందువల్లనంటే జిల్లా పంచాయతీ రాజ్యాల్లో తమ అధికారం నిలుపుకోడానికి ఏ అక్రమం చెయ్యమంటే దానిన్నా చెన్నారెడ్డి విస్పష్టంగా చేశారు. సమితుల స్వరూపం మార్చడం మొదలు అధికార్లను తమ అదుపులో వుంచడం వరకు ఆయన వీరికి ఎంతో సహకారం చేశారు. ఒక బి. డి. ఓ. ను కట్టుకొని స్కౌండ్రల్ అని బహిరంగసభలో తిట్టాడంటే ఆయన అభ్యుదయం ఏపాటిదో మనం పూహించుకోవచ్చు.

ఏమైతేనేమి పంచాయతీరాజ్యంఏర్పడినప్పటినుండి దాదాపు ఒకటిన్నరదశాబ్దం పాటు ఆనంవాళ్లు దానిని తమగుప్పిటిలో పెట్టుకోగలిగారు!

1970 జులైలో జరిగిన ఎన్నికలలో వివిధ సమితులకు ఎన్నికైన అధ్యక్షులు వీరు-

సూళ్ళూరుపేట- బద్దెపూడి పేరారెడ్డి. కోట- నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి. గూడూరు- సి. సి. ఆర్. గోపాలరెడ్డి, వెంకటగిరి- పెట్లూరు రాఘవరెడ్డి, రాపూరు- ఎం. ఆదినారాయణరెడ్డి, పొదలకూరు- కాకాణి రమణారెడ్డి, వెంకటాచలం- రామిరెడ్డి దశరథరామిరెడ్డి, ఇందుకూరుపేట- ఆనం భక్తవత్సలరెడ్డి, కోవూరు- కాటంరెడ్డి వెంకటరామరెడ్డి, బుచ్చి- మేనకూరు బాలకృష్ణారెడ్డి, కావలి- కలికి యానాదిరెడ్డి, వింజమూరు- గొట్టిపాటి కొండపనాయుడు, ఉదయగిరి- పి. చెంచురామయ్య, ఆత్మకూరు- సి. వి. కృష్ణారెడ్డి.

1981 లో జరిగిన పంచాయితీ ఎన్నికలు అన్నివిధాలుగా ప్రత్యేకమైనవి, విశిష్టమైనవి, అందువల్ల వాటి సమీక్ష మరువారం ప్రత్యేకంగా నే ఇస్తాము. ★

# పినాకినీతీరం

(3వ పేజీ తరువాయి)

దాలతో అన్నగారు తెలుగుదేశం కాబట్టి, తాను కాంగ్రెస్ అనిపుంటాడని నావూహ. రేపు అన్నగారు పిలిచి దువ్వితే అయన కాంగ్రెస్‌కు నామంపెట్టి పసుపుపచ్చ జెండా పట్టుకోడనే నమ్మకం నావరకు నాకులేదు. ఆయన అంత బలహీనుడు. అంత అస్థిరచిత్తుడు!

గోపాలకృష్ణ యాచేంద్రగారికాంగ్రెస్ ప్రవేశంవెనక పెద్దరాజకీయాలు వుంచ వచ్చునని పత్రికలు వూహిస్తున్నవి. వెంకటగిరిలో జనార్దనరెడ్డిని దెబ్బతీయడానికి శ్రీ వెంగళరావు ఈయన్ను ప్రోత్సహిస్తున్నాడని ఒకవూహ. దీన్ని నమ్ముకొని ఏట్లోదిగేంత వెర్రివాడుకాదు శ్రీ వెంగళరావు. వెంకటగిరి రాజాలకు సంబంధించి వెంగళరావుగారి అభిప్రాయం పూర్వం వేరు; ఇప్పుడు నాది భిన్నమనేదికూడా ఈ సందర్భంలో గమనించదగివుంటుంది కాకుండా 1983 లో జనార్దనరెడ్డి తనను తాను ఓడించుకున్నాడుగాని; ఒకరు ఓడిస్తే ఓడిపోయినవాడు కాదు, రేపైనా ఒకవేళ గోపాలకృష్ణయాచేంద్రవారు జనార్ధనరెడ్డికి వ్యతిరేకం చేయదలచుకున్నా అది జనార్ధనరెడ్డికి అనుకూల ఫలితాన్నిస్తుందేగాని ప్రతికూలంగాదు!

చిన్న విషయాన్ని గూర్చి వ్రాత దీర్ఘమైంది. గోపాలకృష్ణ యాచేంద్రవంటి వారు రాజకీయంగా ఎటున్నా, ఎటు పోయినా పట్టించుకోవలసినఅవసరంలేదు!

కవికోకిల ఇల్లు-

### పి. సి. రెడ్డి సూచన

కోవూరు తాలూకా ఈగ్రామం పెమ్మారెడ్డి పాళెంలోని కవికోకిల దువ్వూరు రామిరెడ్డిగారి గృహాన్ని ప్రభుత్వం కొని ఆయన స్మృతిచిహ్నంగా భద్రపరచాలని శ్రీ పి. సి. రెడిగారు ప్రభుత్వానికి ఒక సూచనచేశారు. కవికోకిలమీద భక్తితో ఏదో సూచన చేశామనిపించుకోడానికి తప్పితే, దీనివల్ల చేకూరగల ప్రయోజనమేమిటి?

కవికోకిలకవిత్వంఅంటే చెవికోసుకునే వాళ్లు; ఆయన సైన్సు పరిజ్ఞానానికి అచ్చెరువందేవాళ్ళు ఎందరో వున్నారు. ఆయన స్మారకోపన్యాసాలకు ఎందరో పెద్దలు నెల్లూరు వస్తున్నారు రామరెడ్డిగారికి కవితావేశం ఎక్కువ వచ్చేది కాదని, వస్తే గది తలుపులు బిగించుకొని కావ్యం పూర్తి అయ్యేవరకు బయటకు వచ్చేవారుకాదని చెప్తుంటారు కవికోకిలంటే ఇంత అభిమానమున్న వారిలో ఒక్కరైనా పెమ్మారెడ్డిపాళెం పోయి ఆ మహాకవి నివాసాన్ని చూడాలనుకున్నవారున్నారా? నెల్లూరుకు అతి సమీపంలో వున్న పొటూరుకుపోయి తిక్కన గంటపుపెర చూచిరావాలనే ఆసక్తివున్నవారేలేరు! దువ్వూరు రామిరెడ్డిగారి ఇంటిలో ఏదో ప్రత్యేకత 'ఆర్కిటెక్చర్' వుందని పి.సి. రెడ్డిగారన్నారు; నాకూ ఆ పుణ్యగృహాన్ని దర్శించే భాగ్యం కలిగింది; నేను వాస్తుకళలవంటి వాటిలో అనుభవశూన్యుణ్ణనుకోండి; అయినా అదేవిధంగా అనేకచోట్ల అనేక కట్టడాలున్నాయేమో ననిపిస్తుంది ఆ భవనాలు నిర్మించినకాలంలో అటువంటి వాస్తుశిల్పం అమలులో వుండి వుంటవచ్చునేమో?

ఇంతకూ నేను చెప్పదలచింది పెమ్మారెడ్డిపాళెంలో ఆయన స్మృతిచిహ్నంగా ఆయన భవనాన్ని భద్రపరచడంవల్ల ప్రయోజనంలేదు; అక్కడకు పోయేవారుండరు, దాన్ని చూచేవారుండరు: అది గబ్బిలాలకు నిలయమై శిథిలమైపోతుంది. కవికోకిలకు నిజంగా స్మృతిచిహ్నం ఏదైనా నెలకొల్పదలిస్తే అది నెల్లూరులో జరగాలి. అది ఎట్లావుండాలి, ఏ పద్ధతుల్లో వుండాలి ఆ వివరాలన్నీ పెద్దలాలోచించి నిర్ణయించదగినవి. ఇప్పుడు ప్రతిఏడూ వారి స్మారకోపన్యాసం ఏర్పాటవుతున్నది. పి. సి రెడ్డివంటి పెద్దలే స్మృతిచిహ్న ప్రయత్నానికికూడా పూనుకోవచ్చు ఉచిత సలహాలు, ప్రయోగం లేని సూచనలు దండగ!

